


శ్రీ  శ్రీ
కృష్ణాయనమః  గురుభ్యోనమః

# భగవద్గీతార్థసంగ్రహము.

---

శ్లో॥ శ్రీకృష్ణ చరణ ద్వంద్వం ప్రణిపత్యాతి సంగ్రహాత్ । గూఢార్థ దీపికా వ్యాసం కుర్వే త్రైలింగ భాషయా॥ ఆచార్య చరణద్వంద్వ స్మృతిః లేఖక రూపిణాం-మాం కృత్వా కురుతే వ్యాఖ్యాం నాహ మత్ర ప్రభుర్యతః॥

భగవంతులగు శ్రీ కృష్ణు లర్జునునకు భారత యుద్ధారంభంబునందుఁ గర్మ భక్తి జ్ఞానయోగాత్మకమగు నధ్యాత్మతత్త్వము నుపదేశించి యర్జును శోక మోహముల నపనయించినట్లు శ్రీకృష్ణద్వైపాయనులు మహాభారత భీష్మపర్వములోని ౧౮ యధ్యాయములలో ౭౦౦ శ్లోకములు వ్రాసిరి. ఆ యుపదేశమునకు భగవద్గీత యని పేరు. దీనిలో నుండు విషయము లమూల్యములు గాన దీనికి వైదికమతాచార్యులగు శ్రీ శంకర రామానుజ మధ్వ వల్లభాచార్యాదులు వివరణములు వ్రాసిరి. వానిని భాష్యము లనెదరు. ఆ భాష్యములకు వ్యాఖ్యానము లితరాచార్యులు చేసిరి. మఱియు నితరులు ప్రత్యేకముగఁ డీకల నొనర్చిరి. ఇవి యన్నియు సంస్కృత భాషలో నున్నవి. అద్వైత టీకలే ౫౦ గలవని కీర్తి

శేషులును, నా గురువర్యులును, నగు శ్రీశృంగేరిస్వాముల వారు నాతో సెలవిచ్చిరి. వానిలోను, ద్వైత విశిష్టాద్వైతాది వ్యాఖ్యానములలోను, కొన్నియే ప్రచురింపఁబడినవి. భగవద్గీతకు సర్వ దేశ వ్యాప్తి యుండుటంజేసి నానా దేశ భాషలలో దాని తర్జుమాలు, టీకలు, విమర్శనములు, మెండుగ గలవు. మతాంతరులు గూడ దానిని గడు గౌరవముతోఁ జూచుచున్నారు. శ్రీ శంకర భగవత్పాదులొనరించిన భాష్య ప్రకారము భగవద్గీత, కర్మ జ్ఞాన యోగముల నుపదేశించునదియు, అష్టాంగ యోగము, భక్తియోగము, నా కర్మయోగములో నంతర్భాగము లనియు, కర్మయోగము యొక్క పరమ రహస్య మీశ్వర శరణాగతి యనియు, జ్ఞానయోగమున కంగము కర్మయోగ మనియు, జ్ఞానము చేతనే మోక్షము లభించు ననియు, నిశ్చయింపనగు. ప్రథమాధ్యాయము మొదలు ౨ వ దానిలోని ౧౦ వ శ్లోకము వఱకు నధ్యాత్మోపదేశమునకు హేతు వగు నజ్ఞాన జన్య శోక మోహ రూపమగు విషాదయోగము వివరింపఁబడెనని శంకరాభిప్రాయము. ౨ వ యధ్యాయము ౧౧ వ శ్లోకము మొదలు ౬ వ యధ్యాయాంతము దనుక కర్మయోగము, 'త్వం' (జీవ) పదార్థ శోధనమును, ౭ మొదలు ౧౨ వ యధ్యాయాంతము వఱకు భక్తియోగము, 'తత్' (బ్రహ్మ) పదార్థ శోధనమును, ౧౩ మొదలు ౧౭ వ దాని యంతము దనుక జ్ఞానయోగము, 'తత్త్వమసి' యను వాక్యార్థ శోధనము ననియు, ౧౮ వ దానిలోఁ బూర్వ గ్రంథ సంగ్రహమనియు, శ్రీ శంకర భాష్యటీకాకారు లగు శ్రీ ఆనందగిరు లభిప్రాయపడిరి.

శ్రీమధుసూదన సరస్వతులు భగవద్గీతపై గూఢార్థ దీపిక యను ప్రౌఢ వ్యాఖ్యను రచియించి దానిలోఁ దలచుకొనఁబ్రతి పదమునకర్థము వ్రాసి, యక్కడక్కడ వేదాంతములగు నుపనిషత్తులను, బ్రహ్మసూత్రములను, నుదాహరించి, వానిపై నున్న శంకర భాష్య సురేశ్వర వార్తికాదులను జర్చ చేయుటయే గాక పాతంజల యోగ శాస్త్ర వాసిష్ఠ రామాయణాదులలో నున్న రహస్యములను, సోపస్కారముగ వివరించి లోకోపకారముఁ జేసిరి. గీతలపై నింత విపులమగు టీక యింకొకటి లేదు. వీరు దీనిని "అద్వైత సిద్ధి" రచనానంతరము వ్రాసిరి. అద్వైత సిద్ధిలో నద్వైతమును శ్రుతి తర్క యుక్త్యనుభవములతో స్థాపించిరి. దానిపై ననేక వ్యాఖ్యలు విమర్శములు ఖండనములు మండనములు పుట్టినను, అద్వైతాచార్యుల కది మేరుప్రాస. భగవద్గీతపై నున్న శంకర భాష్యటీకలలోని విషయములను విశద పఱచుటయే గాక యితర శాస్త్రీయ సంగతులను గూడ నీ గూఢార్థదీపికలో శ్రీమధుసూదన సరస్వతులు చేర్చిరి. వారికి నతిశతంబులను జేసి యీదీపిక ననుసరించి ప్రత్యధ్యాయార్థముల నీ వ్యాసములో సంగ్రహించెదను.

సంసారమును, దాని కారణమును, నిర్మూలింపఁజేయు మోక్షమే గీతాశాస్త్రములోఁ జెప్పబడిన విషయమునకు ఫలము. సచ్చిదానంద రూపము, పూర్ణము, "విష్ణోః పరమంపదం," అను బ్రహ్మ యొక్క ప్రాప్తి కొఱకు మూఁడు భాగములు గల వేదము లారంభింపఁ బడినవి-- కర్మకాండ, ఉపాస్తి యను భక్తి కాండ, జ్ఞానకాండ

యనునవి మూఁడు భాగములు. ఆ మూఁటి యందును ౧౮ యధ్యాయములుగ భగవద్గీత ప్రకటించు చున్నది. ఒక్కొక్క షట్కములో నొక్కొక్క కాండార్థము ముఖ్యముగ వివరింపఁబడె. షట్కమన నాఱధ్యాయముల భాగము. మొదటి షట్కములోఁ (౧-౬ అ.) కర్మనిష్ఠయు, చివర షట్కములోఁ (౧౩-౧౮ అ.) జ్ఞాననిష్ఠయు వర్ణింపఁబడె. జ్ఞానోత్పత్తికి శ్రౌతస్మార్తకర్మనిష్ఠ యావశ్యకమయినను, జ్ఞానఫలమగు మోక్షోత్పత్తియందా కర్మనిష్ఠవలనఁ బ్రయోజనమేమియు లేదని సూచించుటకు రెండు నిష్ఠలు నొండొంటికి దూరముగఁ బ్రదర్శింపఁబడె. ఈ రెంటికి మధ్యమున భగవద్భక్తినిష్ఠ మధ్యషట్కములో (౭—౧౨ అ) వివరింపఁబడె. ఇది కర్మజ్ఞాననిష్ఠల రెంటిలోఁ గలసి యుండి సర్వవిఘ్నములను బోఁగొట్టును గాన నిది వాని మధ్యమున నున్నది. కర్మమిశ్రము, శుద్ధము, జ్ఞానమిశ్రము, నని భక్తి మూఁడు తెఱఁగులు. మొదటి యాఱింటిలోఁ కర్మఫలత్యాగము, కర్మస్వరూపత్యాగము. నను మార్గద్వయముచే దేహేంద్రియాది వివిక్త జీవస్వరూపము హేతువులతో నిరూపింపఁ బడినది. మనకు నియమింపఁ

బడిన వర్ణాశ్రమ ధర్మములను శ్రద్ధతోఁ జేయుచు వాని ఫలమును గోరకుండుట కర్మఫలత్యాగము. ఇట్టి కర్మఫలత్యాగిని యోగి యనెదరు. శ్రౌతస్మార్తవిధి చోదితమగు నట్టి కర్మములను గూడ మాని వేయుట కర్మస్వరూప త్యాగము. ఇట్టి త్యాగికిఁ బరమార్థ సన్న్యాసి యని పేరు. దేహములో నుండు జీవుఁడు అనాత్మస్వరూపము లగు దేహేంద్రియ మనోచిత్తాహం

కార్యకరణముల కంటె భిన్నుఁడగు ఆత్మ యని స్థాపించుట వివిక్త జీవస్వరూప ప్రతిపాదనము. దీనిచే ౧ మొదలు ౬ అధ్యాయములలో 'త్వం' పదార్థశోధనము చేయఁబడినది. రెండవ ఆఱింటిలో (౭-౧౨ అ) భగవద్భక్తి నిష్ఠావర్ణనమందు భగవత్స్వరూపమగు పరమానందమును ప్రశంసించుటంజేసి 'తత్' పదార్థశోధనము చేయఁబడెను. మూఁడవ ఆఱింటిలో (౧౩-౧౮ అ.) 'తత్త్వం' పదార్థైక్యము స్ఫుటముగ వివరింపఁబడెను.

ఈ మూఁడు కాండల యొండొంటి సంబంధ మిట్టిది.

ఈ గీతాశాస్త్రములో ముక్తిసాధనములు లెస్సఁగ వివరింపఁబడినవి. దీనిలో మొదటియధ్యాయ మితర భాగమునకుపోద్ఘాతము. ౨ వ యధ్యాయములో సర్వగీతాశాస్త్రార్థము సూచింపఁబడినది. మొదట నిష్కామ కర్మనిష్ఠ, దానిచే నంతఃకరణశుద్ధి, దానిచే శమదమాది సాధనములతోఁ గూడిన సర్వకర్మసన్న్యాసము, తదనంతరము వేదాంత వాక్య విచారముతోఁ గూడిన భగవద్భక్తినిష్ఠ, పిదపఁ దత్త్వజ్ఞాన నిష్ఠయు, దాని ఫలమగు జీవన్ముక్తియుఁ బ్రతిపాదింపఁ బడినవి. అది త్రిగుణాత్మకమగు నవిద్యపోయినం గలుగు. ప్రారబ్ధ కర్మఫలమనుభవించు పర్యంతము జీవన్ముక్తుఁడై యుండి యాయనుభవాంతమునందు విదేహముక్తి నొందు. జీవన్ముక్తికి, పరమపురుషార్థమగు విదేహముక్తికిని, ఆలంబనమగు పర వైరాగ్య ప్రాప్తికిని, అట్టి వైరాగ్యోపకారకమగు దైవసంపత్తను పేరు గల శుభవాసనయు నవశ్యము సంపాదింపవలయు. ఆ ముక్తులకు విరోధియగు నాసుర సంపద యని పిలువఁబడు నశుభ వాసనను

బూత్రిగ వినుచ వలయు. దైవసంపద యను శుభవాసనకు ముఖ్యకారణము సాత్త్వికశ్రద్ధ. ఆసురసంపదలకు హేతువులు రాజస తామస శ్రద్ధలు. గ్రాహ్యాగ్రాహ్యములగు సంపదల విభాగముతో నీ శాస్త్రము పరిసమాప్తి నొందింపఁబడినది. దానిలో "యోగస్థః కురు కర్మాణి" (౨-౪౮) లోనగు వానిచే సూచింపఁబడిన సత్త్వశుద్ధికి సాధన భూతమగు నిష్కామకర్మ నిష్ఠ సామాన్యముగ మూఁడవ యధ్యాయములోను, దాని వివరము నాల్గవ దానిలోను జేయఁబడెను. ఈశ్వరార్థముగాని, లోకోపకారముకొఱకుఁగాని, చేయఁబడు కర్మము నిష్కామకర్మమని మూఁడవ యధ్యాయములో సయుక్తికముగఁ జెప్పఁబడెను. భగవదవతార రహస్యమును, అహంకార మమకారములును, ఫలాసక్తియు, లేక చేయుకర్మమును, జ్ఞానయుక్తమైన కర్మమును, నిష్కామకర్మములని నాల్గవ దానిలో వివరింపఁబడె. పిదప శుద్ధాంతఃకరణముగల వానికి శమదమాది సాధనసంపత్తి గలిగి "విహాయ కామాన్ సర్వాన్" (౨-౭౧) లోనగు వానిచే సూచింపఁబడిన ప్రకారము సర్వకర్మ సన్న్యాసనిష్ఠ సంక్షేపముగ ౫వ దానిలోను, విస్తారముగ నాఱవ దానిలోను, వర్ణింపఁబడెను. ౫వ దానిలోని చివర మూఁడు శ్లోకములలో సంగ్రహముగను, ౬వ యధ్యాయములో విస్తరముగను, నష్టాంగయోగ స్వరూపమును, విధానమును, ఫలమును, యోగభ్రష్ట ఫలమును, సర్వభూత సమభావముగల భగవద్భక్తుఁడుత్తమ యోగియనియు, సొంపుగ వర్ణింపఁబడెను. ఈవర్ణనచే నీ షట్కములోఁ "త్వం" పదా

ర్థము నిరూపింపఁబడినది. పిదప, "తత్త్వమస్యాది" వేదాంత వాక్య విచారములతోఁ గూడి నట్టియు, "యుక్త ఆసీత మత్పరః" (౨-౬౧) లోనుఁగాఁగల వానిచే సూచింపఁబడినట్టియు బహుప్రకారములు గల భగవద్భక్తినిష్ఠ ౭ మొదలు ౧౨ అధ్యాయములలో నిరూపింపఁబడినది. వానిలో "తత్పదార్థము" గూడ నిరూపింపఁబడినది. ౭ వ దానిలో నుత్తమాధికారికి 'తత్పదార్థము' 'లక్షణావృత్తిచే జ్ఞేయమనియు, మధ్యమాధికారికి ముఖ్యవృత్తిచే ధ్యేయమనియు, సూచింపఁబడె. ౮ వ దానిలో "తత్పదార్థము" యొక్క ధ్యేయ స్వరూపము, ధ్యాన ప్రకార ఫలములు, దేవయాన పితృయానములును, వివరింపఁబడె. ౯ వ దానిలో జ్ఞేయధ్యేయ బ్రహ్మల వివరము, వాని ముఖ్యసాధనమగు రాజయోగమును గలవు. ౭,౮,౯ యధ్యాయములలో భగవత్తత్త్వము సోపాధిక నిరుపాధికములుగ దర్శింపఁబడుటయే గాక సప్తమాష్టములలో సోపాధికుని ధ్యానార్థము, నవమములో (౯-౩౪) నిరుపాధికుని జ్ఞానార్థము, భగవద్విభూతులు గూడ సూచింపఁబడె. ౧౦ వ దానిలో నా విభూతులను ధ్యానము కొఱకును, వాని తత్త్వము జ్ఞానము కొఱకును, బ్రహ్మతత్త్వము దుర్విజ్ఞేయము గాన లోకానుగ్రహార్థము తిరిగి యా విభూతులు వివరింపఁబడె. వానితోఁ గూడిన భగవద్విశ్వరూపము ధ్యానార్థ మర్జును కోరికమీఁద నతనికి భగవంతుఁడు చూపినట్లు ౧౧ వ యధ్యాయములో వర్ణింపఁబడినది. ౧౨ వ దానిలో భగవద్భక్తి యోగ ప్రకారములగు సగుణ నిర్గుణోపాసనముల యొక్క స్వరూప

ములు, విధానములు, లక్షణములు, ఫలములు, సోపపత్తి-
కముగ వర్ణింపఁబడి, "వేదావినాశినం నిత్యం"
(౨-౨౧) మొదలగు వానిచే సూచింపఁబడిన 'తత్త్వం'
పదార్థనిర్దిష్ట జ్ఞానరూపమగు తత్త్వజ్ఞాన నిష్ఠ ౧౩-వ
యధ్యాయములోఁ బ్రకృతి పురుష తత్త్వ వివేక
మూలకముగ వివరింపఁబడినది. జ్ఞాననిష్ఠకు
ఫలమగు సత్త్వరజస్తమోగుణాతీతస్థితి, "త్రైగుణ్య
విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున"
(౨-౪౫) లోనగు వానిచే సూచింపఁబడి, ౧౪-వ యధ్యా
యములో వివరింపఁబడె. అందు గుణాతీత లక్షణకథన
ముచే జీవన్ముక్తి స్వరూపము చెప్పఁబడె. "తదాగం
తాసి నిర్వేదం" (౨-౫౨) లోనగు వానిచే సూచిం
పఁబడిన పరవైరాగ్య నిశ్చయము సంసార వృక్షమును, విర
క్తితోఁ గూడిన వివేక జ్ఞానముచే ఛేదించు నుపాయము
లును, సర్వవేద గీతాశాస్త్ర రహస్యమగు పురుషోత్తమోపా
సనమును, ౧౫-వ యధ్యాయములో వర్ణింపఁబడి, "దుఃఖే
ష్వనుద్విగ్నమనాః" (౨-౫౩) లోనగు వానిచే సూచి
తములగు స్థితప్రజ్ఞ లక్షణములును, పరవైరాగ్యమునకుఁ
గడు సహకారులును నగు దైవ సంపదలగు సాత్త్విక
గుణములను గ్రహింప వలయుననియు వానికి విరుద్ధము
లను "యామిమాం పుష్పితాం వాచం" (౨-౪౨) అను
వాక్యాదులలోను ౭-౯ యధ్యాయములలోను సూచిం
పఁబడిన యాసుర సంపదలగు రాజసతామస గుణము
లను విడువ వలయుననియు, ౧౬-వ అధ్యాయమునందు
వివరింపఁబడె. దైవ సంపత్తునకు ముఖ్యకారణమగు
సాత్త్విక శ్రద్ధ "నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థః"

(౨-౪౧) లోనగు వానిచే సూచింపఁబడినది. అట్టి సాత్త్విక శ్రద్ధ గ్రహింపవలయు ననియు దానికి విరోధము లగు రాజస తామస శ్రద్ధలు పరిహరింపవలయు ననియు, ౧౭ వ యధ్యాయములో వివరింపఁబడెను. ఇట్లు ౧ మొదలు ౧౭ అధ్యాయములలో ఫలసహితముగ జ్ఞాన నిష్ఠ ప్రతిపాదింపఁబడె. ౧౮ వ దానిలోఁ బూర్వోక్త విషయము లన్నియు నుపసంహారరూపముగ సర్వగీతార్థసార ముపపాదింపఁ బడె.

ఈ భగవద్గీతా శాస్త్రము ముక్తి సాధనములగు ప్రస్థాన త్రయములో నొకటి యని ప్రాచార్యులందఱేకగ్రీవముతో నంగీకరించిరి. కనుకనే దీనిని ఉపనిషత్తనియు, బ్రహ్మవిద్య యనియు, యోగశాస్త్రమనియు, వాడుదురు. వాని సారమంతయు దీనిలో నున్నది. దీని సారార్థమేమన, కామ్య నిషిద్ధ కర్మములను వదలి నిత్య నైమిత్తిక కర్మముల నాచరించి వాని ఫలము కోరకుండినచో నది నిష్కామ కర్మమనఁబడు. అట్టి నిష్కామ కర్మములో హరిజపస్తోత్రాదికము పరమ ధర్మము. ('యజ్ఞానాంజపయజ్ఞోస్మి' ౧౦-౨౫). అట్టి నిష్కామ కర్మాచరణముచే నెప్పుడు చిత్తములోని పాపము క్షీణించునో యప్పుడే నిత్యానిత్య వివేక ముదయించి సుదృఢముగ మనస్సునఁ బాదుకొనును. దానిచే వశీకారమను పేరుగల యిహాముత్రార్థ వైరాగ్యమును, దానిచే శమాది సంపత్తితోఁ గూడిన సన్న్యాసమును, లభించు. ఇట్టి సన్న్యాసికిఁ దీవ్రమోక్షేచ్ఛ యుదయించు. అట్టి

ముఖ్యాధికారి యగు వివిదిషా సన్న్యాసి గురువునొద్ద కేఁగి యుపదేశముఁ బొంది యధ్యాత్మ విషయ సందేహ నివారణము కొఱకు వేదాంత శ్రవణ మననములఁ జేయు నని యుత్తర మీమాంసాశాస్త్రమగు బ్రహ్మసూత్ర ప్రస్థాన ముపపాదించుచున్నది. దాని శ్రవణమనన పరిపాకముచే నిదిధ్యాసన రూపమగు ధ్యానసిద్ధి గుదురు. అందుచే యోగశాస్త్ర మంతయు నావశ్యకత గలుగు. యోగాభ్యాసముచేఁ జిత్తగత దోషము పోఁగా మహా వాక్యము యొక్క తత్త్వబోధ కలుగును. శబ్ద ప్రమాణముచేతనే నిర్వికల్పబ్రహ్మ సాక్షాత్కారము గలుగు. అపరోక్షజ్ఞానముచే నవిద్య నశించు. అవర ణాజ్ఞాననాశానంతరము గాని వలనఁ బుట్టిన భ్రమాది సంశయములును బోవును. తత్త్వజ్ఞాన ప్రభావముచే దాని విరోధములగు సంచిత కర్మము లన్నియు ఫలాభి ముఖ్యములు కానుండగనే నశించు, ఆగామి కర్మము లును బుట్టనే పుట్టవు. కాని, ప్రారబ్ధకర్మ విక్షేపబల ముచేఁ బూర్వకర్మ వాసనా మాత్రము నశింపదు. దానిని జంపు నుపాయము ధ్యానాభ్యాససమాధి రూపమగు సంయమము కంటె వేఱు లేదు. 'ద్వంద్వంహ్యాత్మసమాధినా' అను భాగవత సప్తమస్కంధములోని (౭-౧౫-౨౮ శ్లో) నారద వాక్యము, శంకరకృత వివేకచూడామణి, మాధ వాచార్యకృత పరాశరస్మృతివ్యాఖ్య, లోనగునవి ప్రమా ణములు. ఆ సంయమము, దానికి బహిరంగమగు యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార పంచ కము గూడ, గీతలలో నిరూపింపఁబడినవి. ఈశ్వర ప్రణిధానముచేఁ ద్వరగ సమాధి సిద్ధించు. దానిచే

మనోనాశము, వాసనాక్షయము, తప్పక కలుగు. తత్త్వ జ్ఞానము, మనోనాశము, వాసనాక్షయము, నేక కాల మభ్యసింపఁగ జీవన్ముక్తి దృఢమగు. ఇట్టి జీవన్ముక్తి ప్రాశస్త్యము విస్తారవ్యాఖ్యానము శ్రుతులలోఁ జెప్పఁబడి నది. సవికల్ప సమాధిచేఁ జిత్తమును నిరోధింప నిర్వి కల్ప సమాధిలో నుండు మూఁడు భూమికలు సిద్ధించు. బ్రహ్మవిద్వరుఁడగు జీవన్ముక్తుఁడు సమాధి నావలనుండి స్వయముగనే వ్యుత్థానుఁడగు. బ్రహ్మవిద్వరీయుఁడు ఇతరప్రేరితుఁడే గాని సమాధి నుండి లేవఁడు. బ్రహ్మ విద్వరిష్ఠుఁడైనవాఁడు విధ ముల నైనను సమాధి నుండి లేవక యెప్పటికి నాత్మ నిష్ఠుఁడై యుండును. ఇందునకుఁ బ్రమాణములు మహో పనిషత్తు లోనగు శ్రుతులు, పతంజలి యోగశాస్త్రము, వాసిష్ఠ రామాయణ, శంకరాచార్య ప్రకర ణములు, విద్యారణ్యకృత జీవన్ముక్తి వివేకాదులు, బ్రహ్మవేత్తల యనుభవములు. ఇట్టి బ్రహ్మ విద్వరిష్ఠుఁడు, స్థితప్రజ్ఞుఁడనియు, విష్ణుభక్తుఁడనియు, గుణాతీతుఁడనియు బ్రాహ్మణుఁడనియు జీవ న్ముక్తుఁడనియు, అతివర్ణాశ్రమి యనియు, ఆత్మరతి యనియు, గీతా మను వ్యాసస్మృతులు, వాసిష్ఠ రామా యణ సూత సంహితా భాగవతాదులును, వాడును. అట్టి మహాత్ముఁడు కృతకృత్యుఁడు గాన వాని కేమియు నధ్యాత్మ శాస్త్ర ముపదేశింప కున్నను, వాని లక్షణ ములు, జిజ్ఞాసు లధిక యత్నముతో నభ్యసింప వలయు నని యుద్ఘోషించు చున్నవి. దేవునియం దుత్కృ ష్టమైన భక్తియు దేవునియందువలె గురువునందుఁ

కూడ శక్తి యుత్తమ మయిన భక్తి యు శక్తి మహాత్మ్యన కుండుటంజేసి దుర్విజ్ఞేయము లయిన యీ పరాత్మ విషయము లన్నియు నతనికిఁ బ్రకాశించునని శ్వేతాశ్వతర శ్రుతి నుడువుచున్నది. కాని, నన్ని యవస్థలలోను మనోవాక్కాయములచే నొనర్పు భగవద్భక్తి మోక్షాధికారికిఁ గడు నవశ్యము, మఱియు మహోపకారకము. మొదటి మెట్టులో చేసిన భక్తి పై మెట్లను చేర నుపయోగించును. అట్టి భక్తి చేయనిచో నధికారి కనేక విఘ్నము లుండుటం బట్టి ఫలసిద్ధి సుదుర్లభము. కాననే,

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపి సః।

అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిం॥”

[౬-౪౪,-౪౫] లోనగు వాక్యములచే నర్జునునకు భగవంతులు భక్త్యావశ్యకత నుపదేశించిరి. పూర్వజన్మకర్మము లూహించుటకు మనకు వీలులేదు గాన, సాహసము నుండి పడిన పండురీతిని పూర్వజన్మమందే కృతార్థుఁడైన వానికి నధ్యాత్మశాస్త్రముతోఁ బ్రయోజనమేమియు లేదు. ఈ ప్రకారము మొదటి భూమిక నెక్కిన జిజ్ఞాసువు భగవద్భక్తి లేనిది పైమెట్టెక్కలేఁడు. కాని జీవన్ముక్తి దశయందుఁ జేసిన భక్తికిఁ దద్భూమికా సోపానారోహణము తప్ప ఫలాంతరకల్పనావసరము లేదు. జీవన్ముక్తునకు అద్వేష్టృత్వాది (౧౨-౧౩) గుణము లెట్లు స్వభావసిద్ధ గుణములో యట్లే హరిభజనము కూడ సహజధర్మము గావలయు. కాననే,

"ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే
కుర్వంత్యహైతుకీం భక్తిమిత్థంభూతగుణో హరిః"

(భాగవతే. ౧-౭-౧౦)

శ్రీహరి గుణ పరిభావ మెట్టిదనగ, ఆత్మారాములగు, సర్వగ్రంథి రూపములగు అవిద్యా కామ కర్మములచే నిర్ముక్తులైనను, నగు మునులు కూడ నిష్కారణముగ భగవద్భక్తిఁ జేయుదురని సూతులు శౌనకాదులకు సెలవిచ్చిరి. "తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే" (౭-౧౭) అని భగవంతుఁడు గూడ నర్జునునకుఁ బ్రేమ భక్తి ముఖ్యమని గీతాశాస్త్రములో నుపదేశించిరి. కనుక, మోక్షార్థి మొదట నిష్కామ కర్మము నాచరింప వలయును. ఆ ముక్తికి శోక మోహాదికమగు నాసుర సంపద యను పాపము ప్రతిబంధకము. ఆ పాపము వలన స్వధర్మచ్యుతియు, నిషిద్ధ కర్మసేవయు, ఫలాభిసంధితోఁ గాని లేక యహంకారముతోఁ గాని కర్మము చేయుటయు, సిద్ధించు. కాఁబట్టి నిత్యము నసుర పాపముతోఁ గూడిన పురుషుఁడు పరమ పురుషార్థమగు మోక్షమును బొందక దుఃఖము నెప్పుడు ననుభవించును. సర్వ ప్రాణులకు దుఃఖము స్వభావసిద్ధముగ ద్వేషింపఁదగినది గాన దానికి సాధనమగు శోక మోహాదికము నెల్లప్పుడు విడువ వలయును. అనాది జన్మము నుండి చిరకాలాభ్యస్తమగుటం జేసి దుస్త్యజము, దుఃఖ కారణము నగు శోక మోహాదికమే యుపాయముచే నిర్మూలముగఁ బోవుననియు, ముక్తి యత్యాతురముతోఁ గావలయుననియుఁ గోరు నరునకు తమమైన గీతాశాస్త్ర

మును, భగవంతు లుపదేశించిరి. "గీతాగానా స్సల నామప్యైతికతరచ్ఛాస్త్రం పవిత్రం పరం ॥"

"వాసుదేవస్సర్వం" "అయమహమస్మి" "అహం బ్రహ్మాస్మి" యను బ్రహ్మాత్మైక్య జ్ఞానముచే ముక్తి గలుగుననియు, అట్టి యాత్మజ్ఞానమునకు కంగములుగ జ్ఞానకర్మయోగము లావశ్యకము లనియు, గీతాశాస్త్రము నొక్కి చెప్పుచున్నదని శ్రీ శంకరాచార్యులు శ్రుతియుక్త్యనుభవములతో భాష్యము వ్రాసిరి. బ్రహ్మశ్రీ లోకమాన్య బాలగంగాధర తిలకుగారు ఆ గీత కర్మయోగమునే ముఖ్యముగఁ బ్రతిపాదించుచున్నదని యనేక ప్రమాణములతో విపులముగ లోక మహారాష్ట్రములో వ్రాసి దానికి గీతారహస్యమను కర్మయోగశాస్త్రమను నామమిడిరి. దానికి హిందీ కర్ణాటకాది దేశభాషలలోఁ దర్జుమాలు చేయఁబడినవి. తెలుఁగునఁ గూడ కీర్తిశేషులును, సంస్కృత వ్యాకరణ వేదాంతాది శాస్త్రములలో విశేష పండితులును, తెలుఁగు, మహారాష్ట్ర, హిందీ, బంగాళాది దేశభాషలలో గొప్ప ప్రవేశము గలవారును, నగు బ్రహ్మశ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రుల వారిచే రచియింపించి తిలకుగారు ప్రకటించిరి. అది యతి విపులముగ నున్నది. దానిలో ననేకాముల్య విషయము లున్నవి. శ్రీ మధుసూదన సరస్వతులు తమ దీపికలోఁ జాలచోట్ల శాంకరభాష్యము ననుసరించినను తుదకు గీతాశాస్త్రములోఁ గర్మజ్ఞాన యోగములు భక్తియోగమున కంగమనియు, నా భక్తి యొక్క పరమకాష్ఠ, యీశ్వర శరణాగతి యనియు, సర్వశాస్త్రములకు నక్కడనే

సమాప్తి యనియు, 'సర్వ ధర్మాన్' (౧౮-౬౬) అను చరమ శ్లోక వ్యాఖ్యలో వ్రాసితి. కర్మభక్తి జ్ఞాన విశేషములు బ్రహ్మసూత్ర పాదములోను శ్రీమద్భాగవత పాదములను గ్రంథములలో నేను వ్రాసితిని గాన వాని నిందు జేర్పలేదు. గీతా శ్లోకములు సూత్రప్రాయము లగుటంజేసి యనేకాచార్యుల కనేక విధములగ నర్థమిచ్చుట వాని కలంకారమే గాని దోషముగాదు. 'భగవదభిప్రాయో వ్యాసేనాపి వేదితుం వరాకాః?' అని శ్రీమధుసూదన సరస్వతులంత వారే సెలవిచ్చిరి.

శ్లో॥ శాంతపత్రీకృతం శాస్త్రం పదవాక్యార్థగోచరం
ఆదిమధ్యాంత షట్కేషు వ్యాఖ్యయా గోచరీకృతం॥

శ్లో॥ శ్రీకృష్ణ చరణద్వంద్వే స్మర్తౄణాం మంగళప్రదే
యోగధ్యేయే కృతిరియ మలంకారార్థ మర్పితా.

ఇతిశివం.

వావిలాల వేంకట శివావధాని.

